సుందరరామయ్య, క్రొత్తపల్లి

దంతశోధని

ఏలూరు, 1923

Record no. 229

Sundararāmayya, Krottapalli

Dantaśōdhani

Ēlūru, 1923

Record no. 229

## Bibliographic Record Target

సుందరరామయ్య, క్రొత్తపల్లి.

దంతశోధని / క్రొత్తపల్లి సుందరరామయ్యచే రచియింపఁబడినది.- 2. కూర్పు.- ఏలూరు : కాసంశెట్టి శేషగిరిరావు, 1923.

2, 30 p. ;18 cm.

Record no. 229.

Sundararāmayya, Krottapalli.

Dantaśōdhani / Krottapalli Sundararāmayyacē raciyimpam̐baḍinadi.- 2. kūrpu.- Ēlūru : Kāsaṃśeṭṭi Śēṣagirirāvu, 1923.

2, 30 p. ;18 cm.

Record no. 229.

శ్రీ

# దంతశోధని.

ఇది 1689—

విజయరాంపురము ప్రొప్రయిటరు

శ్రీచెలికాని వేంకటసూర్యరావుగారి

ఆశ్రితుండు

క్రొత్తపల్లి సుందరరామయ్యచే,

రచియింపఁబడినది.

---

ఏలూరు, బుక్కు సెల్లర్సు

కాసంశెట్టి శేషగిరిరావు బ్రదర్సుచే,

ప్రచురింపఁబడియె.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

(రెండవకూర్పు 1000 ప్రతులు.)

192[illegible].



దీని వెల 0—6—0 అణాలు.

# పీఠిక.



వైద్యశిఖామణులారా! ఆర్యులారా!

ఈగ్రంథము నాచేఁ జాలకాలము క్రిందటనే విరచింపఁబడినను, నామిత్రు లొకరు దీని మాతృకను తీసికొని ముద్రించెదనని చెప్పఁగా వారికి చూపించితిని. వారంతట దానిని గైకొని చాలకాలము వఱకు అచ్చు వేయకుండుటచే నాయొద్ద వారికిచ్చిన ప్రతితప్ప మాఱుప్రతి లేకుండుటచేత నేను ముద్రింపించుకొనఁగోరి యడిగినప్పుడు, ఆమాతృక నొక ముద్రాక్షరశాలలో ముద్రణము నిమిత్తమిచ్చితి ననియు దానివారు మాకీయ లేదనుచుండిరనియు నాతోఁ జెప్పినపిమ్మట మరల వ్రాయుటకుఁ గష్టముగాఁ దోఁచి గ్రంథము వృథాగా పోవలసివచ్చెనే యని విచారించి కొంతకాలము, ఆప్రయత్నమునకుఁ బూనుకొనకుంటిని.

ఇట్లుండ నీమధ్యను నామిత్రులును, తరదరములనుండి వైద్య పరిశ్రమయందారి తేఱినవారునగు శ్రీ. కందుకూరి శేషాచార్యులుగారితో నా యీగ్రంథము విషయమై మాటలాడి, అందలి కొన్ని విషయములు వారికి వినిపించినప్పుడు, తప్పక మీరీ గ్రంథరాజమును వైద్యుల కత్యంతోపకారము సేయుదానిని

వృథాగావిడిచి పెట్టుట బాగుండ లేదనియు, మీరుమనస్సు నుపయోగపరచినచో మునుపటికన్న వేయిరెట్లెక్కువ లోకోపకారముగనుండునట్లు రచియింప సమర్థులనియు మరలఁబురికొల్పుటయేగాక, వారిది యొకపనిక్రిందఁ బెట్టుకొని ప్రతిదినమునునన్ను తొందరసేయుచుండుటచేఁ జాలకష్టపడి మాతృక పోవుటచే దుహితృకను సృష్టించి ముద్రించితిని.

మొదటి మిత్రునివలననే ఈదంతశోధనితోఁ బాటువ్రణచికిత్సకును ఆగతియేసంభవించుటంబట్టి కొంచెముచిన్నదియగు నీదంతశోధనిని ముందురచించితి. వ్రణచికిత్స పెద్దదియగుటచేఁ బునఃప్రయత్నమునకుఁ గొంచె మాలస్యము కాఁగలదు. అయినను బ్రపంచమున నీరెంటి యుపయోగమును బ్రకటన కాఁగలందులకు పట్టుదలతోఁ దానినిఁగూడ శీఘ్రకాలములో నే వ్రాసి ముద్రింపింపఁదలంచియుంటిని. ఇందలిప్రాశస్త్యమును గుణజ్ఞులెఱుంగుదురుగాక.

ఇట్లు,

కొత్తపల్లి సుందరరామయ్య,

గ్రంథాధికృతుఁడు.

శ్రీ

# దంతశోధని.

శా. శ్రీగౌరీసుతుఁ డగ్రపూజ్యుఁడు జగచ్ఛ్రేయోభిలాషాత్ముఁడున్
రాగద్వేషవినాశకారకుఁడు సర్వశ్రేష్ఠయజ్ఞోపవీ
తాఢ్యప్రతిభుండు వేదమయుఁ డుద్యన్నాగవక్త్రుండు స
ద్భోగారోగ్యదుఁ డేకదంతుఁడు మముం బోషించునెల్లప్పుడున్.

టీ. ఈపద్యమున విఘ్నేశ్వర స్తవముం జెప్పఁ బడినది. ఇది దంతశోధని యను గ్రంథమగుటం జేసి యేకదంతుని కృతినాయకునిగా నియమింపఁ బడెను,

సీ. ద్రాక్షవాటికనుండి గమలపాకులుచాల
తెప్పించి నిన్నెట్లు తృప్తిపరతు
సేవంతిపువ్వులు చెన్నపట్నమునుండి
తెప్పించి నిన్నెట్లు తృప్తిపరతు
నేపాళమువనుండి నిమ్మకొబ్బరిపండ్లు
తెప్పించి నిన్నెట్లు తృప్తిపరతు
కాశికాపురినుండి గంగాజలంబులు
తెప్పించినిన్నెట్లు తృప్తిపరతు

గీ. గజముఖుండవు నీవునేగడ్డిపోచ
కయినఁజాలను నేఁజేయునట్టిదేమి?
యెట్లుమన్నించెదో నన్ను నెఱుఁగరాదు
నాకుదొరకినవివిజుమీ యేకదంత. 2

తా. ద్రాక్షవాటికనుండి తమలపాకులును, చెన్నపట్టణమునుండి సేవంతి పూవులును, నేపాళమునుండి కొబ్బరిపండ్లును కాశీపురమునుండి గంగాజలములు తెప్పించి నిన్నేవిధముగా తృప్తిపరతునన్నఁగా నివి నాకు అసంభవము లనియు, ఆయా చోటుల నయ్యవి దొరకుట సుప్రసిద్ధమనియు, "పత్రం, పుష్పం, ఫలం, తోయం" అను నీ నాలుగు నీ దైవమునకుఁ గానుకగా నిడునవియనియుఁ జెప్పఁబడెను. నేను గడ్డిపోచకయినఁ జాలనను టచే ఏకదంతుఁడు గనుక, గరికపూజలకు వరంబులొసఁగు దేవరయగుటంజేసి అదియు సంపాదింప నసమర్థుండననియుఁ జెప్పుకొని నాకు దొరకినవివిజుమీ యనుటచే ముందువివరింపఁ బోవు ఫలంబులఁ గానుక పెట్టెద ననియుఁ దెలియపరచెను.

సీ. పాలపండ్లు బలుసుపండ్లు గొలుగుపండ్లు
నల్ల నేరేడుపండ్లు నల్లిపండ్లు
జీడిమామిడిపండ్లఁ దాడిపండ్లు వెలగ
పండ్లు నక్కెరిపండ్లు వాకపండ్లు
రేగుపండ్లను గానరేగుపండ్లు పిసిడి
పండ్లను మామిడిపండ్లు దొండ



పండ్లను నేరేడుపండ్లు నరటిపండ్లు
సీతాఫలపుపండ్లు నీతపండ్లు
గీ. జామిపండ్లను జెందుర్తిగ్రామమధ్య
మందువెలసిన గణపతి! విందు నేతు
నారగింపుము కలిగిన నవియెమేన
మామకడఁదల్లి పుట్టింటిమాటలేల? 3

తా. ఈ పండ్లన్నియుఁ జెందుర్తి యను గ్రామమునఁ దొరకునవియనియు ఇవియే నీకు ఆరగించుటకుఁ బెట్టుచుంటిననియు, "మేనమామకడఁ దల్లి పుట్టింటిమాటలేల" అనుటచే నీవాగ్రామమున వెలసిన దేవుఁడవే యగుటచే నీయొద్ద నేను వేఱుగఁ జెప్పవలసినది లేదనియు నర్థము.

సీ. తాతశిష్యులకు వేదమెనుబదిరెండు
పన్నముల్జెప్పెను క్షుణ్ణముగను
తండ్రిశిష్యులకు స్మార్తము క్రియతోఁగూడఁ
జెప్పె సర్వము నిరాక్షేపముగను
అన్నశిష్యులకును జ్యోతిషశాస్త్రంబు
ద్వాదశభావముల్ దనరఁజెప్పె
నేనువారల దగుజ్ఞానవాసనపొంది
నించుక గవితాప్తినెనసి క్రొత్త
గీ. పల్లిసుందరరామాఖ్య వసుధయందు
నెక్కొనఁగఁజేసి యిప్పుడు నిఖిలలోక

సౌఖ్యదంబును ఘనవైద్య సాంప్రదాయ
కంబునునగు దీనిఁ జేయఁగా గడఁగినాడ. 4

తా. తాతవేదమును తండ్రిస్మార్తమును అన్న జ్యోతిష శాస్త్రమును జదువుకొనిన వారనియు వారి జ్ఞానవాసనచే కవిత్వము చెప్పుటయందు అభిరుచి కలవాఁడనై ఈ గ్రంథమును రచించితిననియును గ్రంథకర్త జెప్పియుండెను.

సీ. చంద్రుండు లక్ష్మియు నుచ్చైశ్శ్రవంబును సుర
కరియును నమృతంబు కల్పకంబు
కౌస్తుభమణియాదిగాఁగల్గు సత్పను
త్కరముతోడను బాలకడలియందు
ఘనుఁడుభిషగ్వంశ యనువునవిష్ణువ
జ్ఝలకుల సత్కులశ జలనిధికి
సోమధీశుండయి యుదయించి సంగమే
శ్వరభిషజుఁడు రాజవైద్యనిపుణుఁ
గీ. డతఁడునామాతులుండౌట నందువారుఁ
గొన్నికొన్ని చికిత్సలు గుదురుపడఁగ
నలవడియెమేనమామ పోల్కలుగనిందు
వ్రాయదొరకొంటి సజ్జనవ్రాతములర. 5

తా. పాలసముద్రములోఁ జంద్రుఁడు, లక్ష్మి, ఉచ్చైశ్శ్రవము, తెల్లయేనుగు, అమృతము, కల్పవృక్షము, కౌస్తుభమణి మొదలయినవానితోఁ గూడబుట్టిన ధన్వంతరివలె, విష్ణువజ్ఝల వంశమను పాలసముద్రమునకు చంద్రుని వంటివాఁడును, రాజ



వైద్యుండును, సంగమేశ్వర నామము గలయతఁడు మేనమామయగుటచే మేనమామ పోల్కలుకొన్నియబ్బి యీ గ్రంథమును వ్రాయగడఁగితిని.

---

### కర్మవిపాకము.

మ. అనృతమ్ము మర్త్యుఁడు కూటసాక్ష్యముల నీయందానిచేదంతరు
జ్నివహంబుల్ జనియించునందులకు నైకృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులుం
దనఁ జాంద్రాయణముల్ సువర్ణముఖ సద్దానాళి కూష్మాండహో
మవిధానంబు జపంబుసేయుటయు క్షేమం బార్యయుక్తిం గనున్.

తా. మనుష్యుఁడు, అబద్ధసాక్ష్యము నిచ్చుటచే దంతరోగములు పుట్టును. తచ్ఛాంతికై కృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, చాంద్రాయణము, సువర్ణాది దానములును, సలిపి కూష్మాండ హోమము, జపమును సేయవలయును.

### అగ్రకృత్యము.

క. నిత్యమును శ్రద్ధతోడం
బ్రత్యూషంబుననెలేచి పలుదోముటయుం
బ్రత్యహము కనులగోఘృత
మత్యంతప్రీతినిడుట యర్హంబరయన్. 7

తా. ప్రతిదినమును శ్రద్ధతో, ఉదయమునలేచి పలుదోముటయు ప్రతిదినమునుకనులయందు, ఆవునేయి బెట్టుకొనుటయుఁదగును.

చ. కనులకుఁ బండ్లకుం బ్రకృతికారణబంధము గల్గియుంటలో
చనముల కెద్దియేనను సంభవమైనను దోడదంతరో
గనిచయముల్బయల్పడుఁ గావునఁ దప్పకయక్షులందుఁగా
చినఘృతమప్పటప్పునుజిల్కుట శ్రేయము మర్త్యకోటికిన్.

తా. కనులకును పండ్లకును ప్రకృతిసంబంధమైన కట్టుబాటు కలిగియుండుటచేత నేత్రములకేదయిన జబ్బుపుట్టినయెడల వెంటనే దంతరోగములుబయల్పడును. కాబట్టి నేత్రములయందు తరుచు కాచిననేయి వైచుచుండుట మంచిది.

సీ. మఱ్ఱిత్రికోటులను మారేడు బరివెంక
జాజినేపాళము సంపెగయును
కానుగయును నుత్తరేణి యంకుడుమద్ది
యూడుగ వేపజిల్లేడు కడిమి
గిరిమల్లికయు మేడి దిరిసెనవావిలి
నేరేడు రావిదానిమ్మమావి
చండ్రజువ్వియువిప్రశస్తంబు దంతధా
వనమున కట్లొనర్చినను దంత

గీ. ములను గల్గెడి రోగముల్ బుట్టకుండు
ధవళిమము జెంది యుండును దంతచయము



రుచినిబుట్టించుఁబండ్ల యశుచినిమాన్చు
నిశ్చలత్వమునొసంగుచు నెగడుమిగుల.

తా. ఇందు జెప్పఁబడిన పుల్లలు దంతధావనమునకు ముఖ్యము. వీనితోఁ బండ్లుదోమిన యెడల దంతములఁ గల్గెడిరోగములు పుట్టవు. పండ్లు తెల్లఁబడును. రుచిగలుగఁజేయును. బండ్లయశుచినిఁ బోగొట్టి కదలిక లేకుండ జేయును.

సర్వసాధారణచికిత్సలు.

అనుష్టుప్పు. సొంటియున్వసయున్ రెంటినుండలం జేసి
రాచినం బంటిజబ్బుల్సమస్తంబున్ వెంటనే శాంతినొందెడిన్. 10

తా. సొంటి, వస, ఈరెంటిని ఉండలుగాఁ జేసి రాచిన యెడల పంటిజబ్బులన్నియును శీఘ్రముగాఁ బోవును.

సీ. అన్నభేదితులంబునం తెయింగువయును
గావిరాయితులమ్ము దేవదారు
చెక్కతూలమునీటఁ జక్కగామర్దించి
మాషప్రమాణంబు మాత్రలుగను
గావించియొకనాడు గాడ్పునారించి
భద్రపరచియుంచి పండ్లనడుమ
నొక్కొక్కమాత్రగానుంచి ద్రవమ్మును
నమియుచుఁ బిమ్మట నుదకములను

గీ. బుక్కిలించియుమిసినను బోవుజిలలు
నలువుటయు వాచినెత్తురు జారుటయును

బుచ్చుటయు బగులుటయూడిపోవుటయును
గదలుటయు గారయును నీరుగారుటయును. 11

తా. తులము అన్నభేది, తులము ఇంగువ, తులము జేగురురాయి తులము దేవదారుచెక్క, ఇవినీటితో మర్దించిమాంసప్రమాణముగా మాత్రలుచేసి ఒకరోజున నీడలోనారఁబెట్టి ఒక్కొకమాత్రచొప్పున పండ్లనడుమను బెట్టుకొని ద్రవమును ఉమియును పిదప ఉదకము పుక్కిలించివేసిన కుదరలును, సలుపు, నొప్పు, రక్తస్రావము, పుప్పి, పగుళ్ళు, ఊడుట, కదలుట, గారపట్టుట, నీరుగారుటయునును.

ఉ. గంధపుఁబొట్టు గిద్దెడొక కల్వమునందున వైచి నూరియం
దుంకులమెత్తు కప్పురముఁ దోడ్పడనుంచి ప్రదోషకాలమం
దుందగ దంతధావనముతోడన రాయుచుఁదోమిరేని ప
ల్సందులకల్మషంబెడలి చక్కని శ్వేతముగల్గుఁ బండ్లకున్. 12

తా. గిద్దెడుగంధపు పొట్టు ఒక కల్వములోవైచినూరి అందు ఒకతులమెత్తు కప్పురముజేర్చి ఉదయమున దంతధావనముచేయునప్పుడు రాచి తోమినయెడల పల్లుసందుల నున్నకల్మషము పోయి తెల్లబడును.

గీ. ఉదయమున దంతధావన మొనరజేసి
తైలగండూష మొనరింప దంతములచి
వుళ్ళనెత్తురు జిమ్ముట పుట్టదెపుడుఁ
బండ్లునూరేండ్లకుం బటుత్వంబు విడవు. 12



తా. ఉదయమున దంతధావనముచేసి, నూనెపుక్కిలించియుమిసినయెడల దంతముల చివరలు నెత్తురు జిమ్ముటఎన్నఁడును బుట్టకుండుటయే గాక దంతపటుత్వము నూరేండ్లవఱకుఁజెడదు.

చ. నిడుపులవంగముల్ పిడకనిప్పులమీఁదను వెచ్చఁజేసియు
ప్పొడితగు సొంటిగంధమునఁబోసి దినత్రయమూరనిచ్చి యే
ర్పడనవియెండఁబోసి మునివంటనుబట్టి ద్రవంబుదంతముల్
దడియగ రాయుచుండినవళత్వములై కను దార్ఢ్యముంగనున్.

తా. పొడవుగానున్న లవంగములు పిడకనిప్పులమీఁద వెచ్చజేసి వెంటనే వానికితగినంత సొంటిగంధములోఁ బోసి మూడు దినములూరంబెట్టి పిమ్మట నెండఁబెట్టి మునివంటితో బట్టి ద్రవము దంతములు తడియునట్లు రాచినయెడల తెల్లఁబడిదంతములు పటుత్వము గలవియగును.

చ. ఒకతులముప్పునీరు సెగనుంచి నగంబగునట్లుకాచిదిం
చి కరకకాయపేడులను చిన్నవినాలుగువైచి యందులో
నొకగడె నాననిచ్చి యవియొక్కొకటొకటందుగఁదీసిదంతప
ఙ్క్తికి ద్రవమూరునట్టులుగఁ గీచినఁ గల్మషమెల్లఁబోయెడిన్.

తా. ఒకతులముప్పునీరు సెగమీఁదఁబెట్టి సగముగునట్లు కాచి దింపి నాలుగు చిన్నకరకకాయ పేడులువైచి, ఒక గడియనాననిచ్చి అవి ఒక్కొక్కటితీసి దంతములనుండి ద్రవమూరునట్లు గీచినయెడల కల్మషముపోవును.

క. జంబీరఫలరసంబును
నింబకుసుమరసము తింత్రిణీదళరసముఁ
జంబూమూలరసముదం
తంబులకుం గల్పి రాయ ధవళిమఁ జెందున్. 16

తా. నిమ్మపండ్లరసము, వేపపువ్వురసము, చింతాకు రసము, నేరేడు వ్రేళ్ళరసము ఇవికలిపి దంతములకు రాచిన యెడల తెల్లఁబడును.

క. జిలకఱ సైంధవముంబి
ప్పలియున్సమములుగనూరి పండ్లకురాయం
దొలఁగుంబోటును వాపుఁగ
దలుటయు జిలరక్తపతన దౌర్బల్యంబుల్. 17

తా. జీలకఱ్ఱ, సైంధవలవణము, పిప్పలి, ఇవి సమానభాగములుగా నూరి పండ్లకు రాచినయెడల పోటు, వాపు, కదలుట, దురద, రక్తస్రావము, దుర్బలత్వము మానును.

సీ. నూనెలక్కరసంబునుం బాలుదినుసున
కొంకకపస్థంబుఁజక్కఁ జేసి
లోందు మంజిష్ఠయు నతిమధురము నల్ల
కల్వగడ్డయును నగరును దేకుఁ
దామరగుమ్మడిఁ దగఁగషాయంబులఁ
దీసినూనెకునాలుగేసి రెట్లు
కల్పియన్నియును జక్కఁగఁ దైలముగఁ గాచి
రదనంబులకు రాయఁ గదలుటయును



తా. పటిక, కర్పూరము, వస, శొంఠి, ఇవి సమానభాగములుగనూరి దంతములకుబూసి తోమి కడిగినయెడల పండ్ల దుర్బలత్వముపోయి పుప్పిబట్టకుండును.

గీ. జమ్మికాయలు నాలుగు జమ్మిచెక్క
తులము రెండును మెత్తగాఁ గలువమందు
నూరి దానికిఁ దగు కాచు నీరుఁగలిపి
రాచినన నణంగు దంతదుర్బలత వేగ. 27

తా. నాలుగు జమ్మికాయలు, తులము జమ్మిచెక్కయీరెండును మెత్తగానూరి దానికిఁదగిన కవిరినీళ్ళను గలిపి రాచినయెడల దంతదుర్బలత్వము పోవును.

గీ. తుంగదుంపలముక్కలు తులము జాజి
చెక్కరసముననొకనాడు జేర్చియుంచి
తీసియెండించి యవిగుండజేసితోమ
దంతదౌర్బల్యమడఁగి శుద్ధతవహించు. 28

తా. తులము తుంగదుంపముక్కలు జాజిచెక్కరసములో నొకనాడు నాననిచ్చి తీసి యెండబెట్టి గుండఁగొట్టి దానితో తోమినయెడల దంతదౌర్బల్యముపోయి స్వచ్ఛముగానుండును.

గీ, వెలగచిగురు తులమ్మును గలువమందు
నూరి తులమెత్తుపొడి ఘనసారమందు
గలిపిపండ్లకురాచిన గట్టిపడును
పుచ్చులును మూద శూలలు బుట్టకుండు. 29

తా. తులము వెలగజిగురునునూరి అందులో తులమెత్తు కర్పూరము కలిపి పండ్లకు రాచినయెడల గట్టిపడుటయే గాక పుప్పి, దంతమాద, దంతశూల ఇవి పుట్టకుండును.

క. దింతెనపాటయు విష్ణు
క్రాంతమునుల్మిరియు నీశ్వరయు సమముగనం
ట్రింతరసమ్మున మెత్తగ
దంతములకు నూరిరాయ దార్ఢ్యముగలుగున్,

తా. దింతెన, పాట, విష్ణుక్రాంతము, ఉలిమిరి, ఈశ్వర, ఇవి సమభాగములు చేసి అంట్రింతరసముతో మెత్తగానూరి పట్టించినయెడల దంతములు గట్టిపడును.

చ. పనుపడ(దుంగముస్తెలునువాయువిడంగములుంగటుత్రయం
బునువసనింబపత్రిములు(బోకుహారీతకిగోవుమూత్రమం
దునసమమొప్పనూరియదితోడనెమాత్రలుజేసియార్చి బు
గ్గనునిదురించునప్పుడిడ(గా రదనంబులుగట్టిబారెడున్.

తా. తుంగదుంపలు, వాయువిడంగములు, శొంఠిపిప్పలిమిరియములు, వస, వేపాకులు, మంచుగడ్డ, కరకకాయలు, ఇవిసమానభాగములుచె ఆవుపంచితముతో నూరి మాత్రలుచేసి యారట్టి నిద్రించునప్పుడు బుగ్గను బెట్టుకొనునెడల దంతములు గట్టిపడును.



పుప్పిపంటికి.

క. పదునగుకాచును కొంచెము
రదనంబుల నొక్కిపట్టి ద్రవముమిసినచో(
గుదురుల దిట్టము నేయుచు(
జెదరివిడిన పుప్పిపండ్ల( జివురెత్తించున్. 32

తా. పదునుగానున్న కవిరిముక్కను దంతములతో నొక్కిపట్టి ద్రవము ఉమిసినయెడల కుదుళ్ళుగట్టిచేసి, ముక్కలుగా విడిపోయిన పుప్పిపండ్లను జిగిరింపజేయును.

సీ. మాచికాయతులమ్ము మతీరసభస్మంబు
పావుతులంబును బటికతులము
సాంబ్రాణితులమును సైంధవలవణంబు
పావుతులము కాచుపావుతులము
గంబూరతులమును గారింగువతులమ్ము
వసతులమ్మును బ్రూనిపసపుతులము
తుంగదుంపలు పావుతులమును మంచిగం
దపుపొట్టుతులమును దనర(నూర్చి

గీ. వెంపలిరసంబుతో నూరి వ్రేలితోడ(
దీసిరాచిన( బలుపుప్పి( దీసివైచు
శూలలను మాదలనణంచి శుభ్రపరచు
రక్తపతనంబుమాన్చి స్థిరత్వమొసగు. 83

తా. తులముమాచికాయ, రసభస్మము పావుతులము, పటికతులము, సాంబ్రాణితులము, సైంధవలవణము పావుతులము, కవిరి పావుతులము, కర్పూరము తులము, కారింగువ తులము, వస తులము, మానిపసపుతులము, తుంగదుంపలు పావుతులము, మంచిగందపుపొట్టు తులము వీనిని వెంపలిరసముతో నూరి వ్రేలితో రాచినయెడల పుప్పిహరించుటయేగాక దంతశూలలు, దంతనూదలుపోయి రక్తపతనము కట్టును.

మ. వసనీటం దగఁ బాటమూలికను నీర్వట్టంగ నానించి దం
తసమూహంబున నొక్కిపట్టి ద్రవముం దంతంబులో నింకున
ట్లుసహింపం బురువుల్నశించుచును బల్లుందోమున ప్పూర్తిఁగో
వెసస్థైరెపడి దంతసంచయము దీప్తింజెందు నెల్లప్పుడున్. 34

తా. పాటవేరును వసనీటిలో నానఁబెట్టి దానిని దంతములతో నొక్కిపట్టి ద్రవము దంతములోనికి దిగునట్లుసహించియున్న యెడల పురుగులుచచ్చి దంతధావనముచేయునప్పుడు ఉమ్మితో నీరయి పడిపోయి దంతములు శుభ్రపడును.

గీ. సన్నకానుగపుల్లఁ బల్సందులందు
మలిన మెడలంగ గ్రుచ్చుచు మంచినీటఁ
బుక్కిలించుచు నుమిసినఁ బోవుజిలలుఁ
బుప్పియును రక్తపాతంబు నొప్పివాపు. 35

తా. సన్నపాటి కానుగపుల్లతో పంటి సందులయందు మలినముం బోవునట్లు గ్రుచ్చి మంచినీటితోఁ బుక్కిలించి యుమిసినయెడల నురదలు, పుప్పి, రక్తస్రావము, నొప్పి, వాపు, ఇవిమానును.



చ. ముదిరినపాటవేరొంటిముక్కలుముక్కలు చేసి పండ్లతో
నదిమిద్రవంబులోనదిగునట్లులనుంచినఁ బంటిలోని పు
ర్వ్యాదినములోననీరసముఁ బొందినశించు నుగుల్లయైనయా
రదనముగట్టిబారి భిదురప్రతిగాథము నం జెలంగెడున్. 36

తా. ముదిరినపాటవేరును ముక్కలుముక్కలుగాఁ జేసి పండ్లతో నదిమి ద్రవము పంటిలోనికి దిగునట్లు నుంచినయెడల పంటిలోని పురుగు దినములో నీరసించి చచ్చిపోవును గుల్లయయిన యాదంతము గట్టిపడి వజ్రాయుధమువలె నుండును.

ఆ. పాలకట్టెబొగ్గు భస్మంబుగానూరి
యంతయెత్తు లవణమందు వైచి
కలియనూరి కుంచెగాఁ జేసి బరివెంక
పుడుకతోడఁ దోమఁ బుర్వుజచ్చు. 37

తా. పాలకట్టెబొగ్గు భస్మముగానూరి దానియెత్తు ఉప్పు అందులో వైచి కలియనూరి, బరివెంకపుడుక కుంచెవలెఁ జేసి దానితోఁ దోమినయెడలఁ బురుగు చచ్చిపోవును.

చ. వసబరివెంకపాలగలువంబున మొత్తగనూరియందు బో
డసారసంబుఁ గల్పికొని టంకణమించుక జేర్చి నిప్పుపై
బుసబుసఁబొంగఁ జేసి యదిపుచ్చినపంటికి రాచి రేనిఁ బ
ల్ననలునుబుర్వులుఁ జను దినంబున దార్ఢ్యముగల్గుఁ బండ్లకున్

తా. వసను బరివెంకపాలతో మెత్తగనూరి యందుబోడసలవుతీగ రసమునుగల్పి కొంచెము వెలిగారమును వైచి నిప్పుమీఁదఁ బొంగించి దానిని పుప్పిపంటికి రాచినయెడల, దురదలు, పురుగులు ఒకదినములో బోయి పండ్లు గట్టిపడును.

క. నీలియును వెలుమసంధియుఁ
బాలకొడిసి చేదుసార యపామార్గణముఁ ద
క్కోలము ననునీయాఱింటి
మూలములం బండ్లనిడఁ గ్రిముల్ నశియించున్. 39

తా. నీలి, వెలుమసంధి, పాలకొడిసి, చేదుసార, ఉత్తరేణి, తక్కోలము ఈఆఱింటి వేళ్లను బండ్లయందుఁబెట్టినయెడల పురుగులుజచ్చును.

క. జీరకము నుప్పు వసయును
నారతి కర్పూరమును బయుంబునసరిగా
నూరి రదనముల రాచిన
గారయుఁ బుప్పియును గదలికయు మానువెసన్. 40

తా. జీలకఱ్ఱ, ఉప్పు, వస, ఆరతికర్పూరము ఇవి నీటితో నూరి దంతములకు రాచినయెడల గార, పుప్పి, కదలిక వెంటనే మానును.

క. ధవళసుగంధి దళంబులు
గవిరియు సమముగనునూరి గట్టిగఘుటికల్



దవఁ జేసి బుగ్గనిడినఁబు
రువు వేగమెచచ్చి దంతరుగ్రుజలణఁగున్. 41

తా. తెల్లసుగంధి ఆకులు, కవిరి ఈరెంటిని సమానభాగములుగా నూరి గట్టిగామాత్రలుచేసి బుగ్గనుబెట్టుకొనినయెడల పురుగువెంటనే చచ్చిపోవుటయేగాక దంతములయందుఁబుట్టు రోగములన్నియును మానును.

గీ. తేనెజంబీరరసము మాదీఫలరస
మును సమానంబుగాఁగల్పి పుప్పిపండ్ల
రాచియుద్దినఁ బుర్వులు జూచుచుండఁ
జచ్చిపడు జిలవాపును శాంతియగును. 42

తా. తేనె, నిమ్మపండురసము, మాదీఫలరసము ఇవి సమానభాగములుగాఁగల్పి పుప్పిపండ్లకు రాచి రుద్దినయెడల చూచుచుండగనే పురుగులు చచ్చి పడుటయేగాక దురద, వాపు ఇవికూడ శాంతించును.

గీ. పుప్పిపల్లున దురదలు పుట్టెనేని
మిరియములు వస నీటిలోనరుగఁదీసి
కాచుముక్కను గొంచెము కలియనూరి
విడువకుండంగనొకజాము వేయఁగుదురు. 43

తా. పుప్పిపంటిలో దురదలు పుట్టినయెడల మిరియములు వస నీటిలోనరుఁగదీసి కొంచెము కవిరిగలిపినూరి ఒక జాము విడువకుండ రాచినయెడల కుదురును.

రక్తస్రావమునకు.

గీ. పంటిచెంబడిరక్తంబు పడుచునున్న
నల్లమందొకకొంచెము నలిపివెచ్చఁ
జేసియదిపంటినడుమను వేసియదిమి
ద్రవముమియుచుండఁ గట్టునుతక్షణంబ. 44

తా. దంతమునుండి రక్తముపడుచుండిన యెడల కొంచెము నల్లమందుమునలిపి వెచ్చజేసి యదిపంటినడుమను బెట్టి పట్టియుంచిద్రవముసు ఉమియుచుండినయెడలఁగునును.

చ. భయమగునట్లుగా రదనపఙ్క్తుల నెత్తురు గారుచుండెనే
సియుఁబటికమ్ముఁజేకొనుచునిప్పులమీఁదను బొంగఁజేసిమం
చియుదకమందుఁగల్పికొని చేరెడుచేరెడునోటఁబట్టియూ
ర్మియెడలఁబుక్కిలించిన నిమేషమునందునఁగట్టువింతగాన్.

తా. భయమగునట్లు దంతములనుండి నెత్తురుకారుచుండినయెడల పటికనిప్పులమీఁదఁ బొంగించి మంచినీళ్ళలో గలిపికొని నోటితో చేరెడుచేరెడుబట్టి పుక్కిలించి యుమిసిన యెడల నిమిషములో వింతగాగట్టి పోవును.

గీ. జీరలవణహారీతకీ సింధుఫేన
శాల్మలీకంటకంబులు సమముగాఁగ
నూరిరాచిననెత్తురుఁగారుటయును
జలనమునువాపుఁ బోట్లుఁబగులుటమాను. 46



తా. జీలకఱ్ఱ, ఉప్పు, కరకకాయ, సముద్రపునురుగు, బూరుగుముండ్లు ఇవి సమానభాగములుగానూరి రాచినయెడలరక్తస్రావమును, కదలుట, వాపు, పోట్లు, పగులుట యివి మానును.

గీ. పోకమసి దాడిమీరసంబుఁ బొగడపూవు
పొడిచేసి సమభాగములుగాఁగ నిడి లకుచర
సమునమర్దించి యద్ది దంతములనిడిన
రక్తపతనంబు నసలు క్షిప్రమునగట్టు. 47

తా. పోకచెక్కలమసి, దాడిమీరసము, పొగడ పువ్వులపొడి ఇవి సమానభాగములుగా నిమ్మకాయ రసముతో మర్దించి దానిని దంతములకుఁబట్టించినయెడల రక్తస్రావము మురదలు, వేగముగాఁ గట్టును.

సలుపునకు.

గీ. పల్లు సలుపుచునుండినఁ దెల్లనైన
వస్త్రశకలంబు నొకదానిఁ బటికనీటఁ
దడిపి తడియుండునట్లుగఁ బిడిచి కాచి
యద్దినను దక్షణమసౌఖ్యమబ్బగలదు. 48

తా. పల్లు సలుపుచుండినయెడల తెల్లనిగుడ్డను పటికనీళ్ళలోఁ దడిపి తడియుండునట్లు పిడిచికాచి, ఆగుడ్డతో నద్దిన యెడల వెంటనే నివారించును.

అనుష్టుప్పు. తీపివస్తువులందిన్నఁ రావునన్మందుచుండినన్
వేపసారమురాయంగం దీపులన్నియుమానెడున్.

తా. తీపివస్తువులను దినినప్పుడు, ఆరావుచే మందు చుండినయెడల వేపజిగురును రాచినయెడల తీపు లన్నియును మానును.

క. ముండియుఁ బోకయు సరిగా
రెండును జూర్ణంబుఁ జేసి రేలరసముతో
నుండలుగఁ జేసి దంతపు
టుండలకుం దగులనుంచ నణఁగుం బోటుల్.

తా. బోడరసమును, పోకచెక్కలును రెండును సమానభాగములుగాఁ జూర్ణముచేసి రేలాకురసముతో మాత్రలు చేసి దంతములమూలములకుఁ దగులునట్లు పెట్టియుంచినచో బోట్లు శమించును.

గీ. కరకకాయయు నిందుప గార వీనిఁ
దుల్యభాగంబులుగఁ జేసి తులసియాకు
రసమునను నూరి గట్టిమాత్రలుగఁ జేసి
దంతములనిడఁ బోటులు శాంతినొందు. 51

తా. కరకకాయ, ఇందుపకాయ, గారకాయ వీనిని సమభాగములుచేసి తులసియాకు రసముతో మర్దించి మాత్రలు చేసి దంతములలోఁ బెట్టిన యెడల పోటు నెమ్మదించును.



గీ. ముస్తెలును బొద్ది లొద్దుగ యుస్త్రిమాని
పసపు మంజిష్టి రోహిణి పసపు చాగ
సొంటి చెంగల్వకోష్టును జూర్ణములుగఁ
జేసి తోమినఁ బోట్లును జిలలుమానును.

తా. తుంగదుంపలు, బొద్ది, లొద్దుగ, ఉస్త్రి, మాని పసపు, మంజిష్టి, కటుకరోహిణి, పసుపు, చాగ, సొంటి, చెంగల్వకోష్టు వీనిని చూర్ణముజేసి తోమినయెడల పోట్లు, పురవులు మానును.

దంతశూలలకు.

గీ. వకుళఫలములఁ గొన్నింటి బలుసుముండ్లఁ
జిల్లులుగఁ జేసి దాని దాల్చినరసంబు
లోన నూరించి యాపండ్లలోనిగుంజు
నలిపి రాచిన దంతశూలలు హరించు.

తా. కొన్నిపొగడపండ్లను బలుసుముండ్లచేత కన్నములుపొడిచి ఆపండ్లను దాల్చినిరసములో నూరవైచి ఆపండ్ల లోనిగుంజు నలిపి రాచినయెడల దంతశూలలు హరించును.

ఆ. అన్నభేదితోవరిమన్ను నింగువ దేవ
దారుసమముగాఁగ నూరిమాత్ర
కట్టుఁగట్టిపంటఁ బెట్టినఁగ్రిమి దంత
శూలలెల్లవేగ శుభ్రమగును. 54

తా. అన్నభేది, తోవరిమన్ను, ఇంగువ, దేవదారువీని ని సమానభాగములుగానూరి మాత్రలుగాఁజేసి పంటియందుఁ బెట్టినయెడల పురుగుజాతి దంతశూలలన్నియును వెంటనే మానును.

దంతమాఁదలకు.

ఆ. మూరుకొండచెట్టు వేరుతోదంతధా
వనము నేసియున్న వనమునందు
నశ్మచూర్ణముంచి యదిపుక్కిలించుచు
నుమియదంతమాఁదలుపశమిల్లు. 56

తా. మూరుకొండవేరుతో దంతధావనముచేసి వేఁడి నీళ్లయందు శిలాజిత్తుపొడివైచి యానీటిని పుక్కిలించి యుమిసినయెడల దంతమాఁడలు నివారణమగును.

చిగురుబ్బునకు.

గీ. పలుచిగురులుబ్బి కడుబాధపడెడు వేళ
సూచికాగ్రంబు నిప్పునఁ జూడి చూఁడు
పెట్టిపదపడి శుభ్రమైనట్టి లవణ
మద్దినక్షణంబులో సౌఖ్యమబ్బఁగలదు. 56

తా. పలుచిగుళ్ళుబ్బి బాధగానున్నప్పుడు సూదికొన కాల్చి ఆయుబ్బినదానిపయి వాతబెట్టి తరువాత తెల్లని ఉప్పు నద్దినయెడల క్షణంబులోఁబోవును.



గీ. కచికచేఁదోమి ముందుగాఁ గడిగి పిదపఁ
బచ్చినేపాళపుంబుల్లఁ బండ్లుదోమఁ
జిగురువాచుట నెత్తురు జిమ్ముచుంట
గారపట్టుటయును మాను కరకుబూను. 57

తా. కచికతోఁ దోమికడిగి తరువాత పచ్చినేపాళపుపుల్లతో పండ్లుదోమినయెడల చిగురుబ్బుట, వాచుట, నెత్తురు జిమ్ముచుండుట, గారపట్టుట ఇవిపోయి కరకుపచ్చును.

దంతచలనమునకు.

గీ. కదలినను జీముఁగారి రక్తంబుపడిన
యంతటను రసకర్పూర మతిమధురము
లొద్దుగయు లక్కయును దేనెలోననూరి
కలిపి గండూషమొనరింపఁ దొలఁగుబాధ. 58

తా. దంతములు కదలినను, చీము, రక్తము పడినను వెంటనే రసకర్పూరము, అతిమధురము, లొద్దుగ, లక్కవీనిని తేనెతోనూరికలిపి పుక్కిలించినయెడల బాధనివారణయగును.

దంతవ్రణమునకు.

ఉ. అల్లనబ్రహ్మమేడి దళ మంగుళులంగొని పంటిగడ్డపై
నల్ల నవింపరాచి లవణంబుల నైదిఁటినిం గటుత్రయం
జల్లని తేనెతో మెదపి సారెకుసారెకుఁ బూటరాచినం
జల్లున గాలి మబ్బు విడుచందమునం గుదుపుల్ నశించెడున్.

తా. మెల్లగా బ్రహ్మమేడి ఆకును వేళ్ళతో పట్టుకొని పంటిగడ్డమీఁద రక్తముచిమ్మునట్లు రాచి, పంచలవణములను శొంఠిపిప్పలిమిరియములను కాచని తేనెతో నూరి గణియుగడియకు ఒకపూట రాచినయెడల, గాలిచేత నుబ్బు విడిపోవునట్లు చల్లగా కురుపులు మానిపోవును.

గీ. పచ్చిపోకలపొడు మొకపావుతులము
కప్పురపునీటనానించి కాచుఁగలిపి
పంటిమూలంబులకు రాయఁ బల్లుకురుపుఁ
బుప్పిపల్లులుమాదలుబుట్టకుండు. 60

తా. పచ్చిపోకచెక్కలపొడుము పావుతులము కర్పూరపునీళ్ళలో నానఁబెట్టి కవిరికలిపి పంటిమూలములకు రాచినయెడలఁ బలుకురుపులు, పుప్పిపల్లులు, మూదలు బుట్టవు.

క. జిల్లేడుపాలు కుఱుపుల
మెల్లఁగఁబట్టించి పసపు మీఁదనిడినచోఁ
బల్లుకురుపులును దురదలుఁ
దెల్లంబుగమాని పండ్లు తేజముఁ నొందుఁ 61

తా. జిల్లేడుపాలను పంటికుదుళ్ళకుఁబట్టించి మీఁద పసపు అంటించినయెడల పలుకురుపులు, దురదలు శుభ్రముగా మాని పండ్లు చక్కబడును.



అపథ్యములు.

క. కనరుంగూరలునుంబు
ల్లనిఫలములుఁ గలుషశీతలజలంబులు ఖా
వనముఁ గఠినభక్ష్యమును ద
శనరోగి యపథ్యమని విసర్జింపవలెఁ. 62

తా. కనరుకూరలు, పులుపుగల ఫలములు, కలుషజలము, చలినీళ్ళు శోషము, కఠినపదార్థభక్షణము దంతరోగములుగలవారలు, అపథ్యములని విడువవలయును.

గద్యము.

ఇది శ్రీకౌండిన్యసగోత్రపవిత్ర రామనామాత్యపుత్ర సకలభిషగ్వి
ధేయ కొత్తపల్లి సుందరరామ నామధేయ ప్రణీతం
బయిన దంతశోధని సర్వంబును సంపూర్ణము.
శ్రీగణాధిపతయేనమః

శ్రీ. శ్రీ. శ్రీ.

